# పురుష లక్షణం

people may forget what you said ,people may forget what you did,but they will never forget how you made them feel. - Maya Angelou

**Wednesday, May 9, 2012**

## స్క్రీన్‌ప్లే ఉపకరణాలు : ప్రేరణ



**ప్రేరణ (Motivation):** ఒక వ్యక్తి చర్య చేయడానికి ప్రోద్బలం చేసే కారణమే ప్రేరణ. ప్రేరణ కలగడానికి ముందు వ్యక్తి తనకి తాను ఒక విషయం పట్ల ఇష్టమో, అయిష్టమో(ఆకర్షణ, వికర్షణ లేదా రాగద్వేషాలు) కలిగివుండాలి. ఇప్పుడు క్రమంగా తను ఆ విషయాన్ని సాధించడానికి లేదా ఆ విషయం నుండి దూరం కావడానికి చేసే ప్రయత్నాల్లో భాగంగా జరిగే సంఘటనల వల్ల అతనిలో భావోద్వేగాలు కలుగుతాయి. ఈ భావోద్వేగాలే అతన్ని చర్యలు చేసేలా ప్రోత్సహిస్తాయి. అసలు మనిషి ఏ ప్రయత్నమైనా ఎందుకు చేస్తాడంటే ఆనందం పొందడం కోసం దీన్నే ఇంకో విధంగా చెప్పాలంటే కష్టాల నుండి విముక్తి పొందడం కోసం అనవచ్చు. సాధారణంగా ప్రేరణ పొందడం చాలా నిదానంగా జరిగే ప్రక్రియ కానీ కొన్ని అరుదైన సందర్భాల్లో ఈ ప్రేరణ హఠాత్తుగా పనిచెయ్యడం జరుగుతుంది.

ఈ ప్రేరణ కలగడానికి కారణం మనలో వున్న 1.భావం (Feeling) 2.భావోద్వేగం (Emotion). వీటిలో భావాన్ని సముద్రంతో పోలిస్తే, భావోద్వేగాన్ని కల్లోలంగా వున్న సముద్రంతో పోల్చవచ్చు. ఏదైనా భావం ఏర్పడటానికి ఒకే రకమైన సంఘటనలు వాటి తీవ్రతలో తేడాతో మనకి అనుభవానికి వచ్చినప్పుడు అవి ఏ భావానికి సంబంధించిన సంఘటనలైతే మనకి ఆ భావాలు ఏర్పడతాయి. ఆ సంఘటనలు మనపై ప్రభావాన్ని చూపించేంత ప్రేరణ కలిగితే భావం ఉద్వేగం చెందుతుంది - అదే భావోద్వేగం. ఇవి ఏర్పాటు చేయడానికి రచయిత ఎంతో శ్రమిస్తాడు. ముందుగా తాను ప్రేక్షకుడ్ని ఎలా భావింపజేయాలనుకుంటున్నాడో వరుసగా అలాంటి సన్నివేశాలు సృష్టిస్తాడు, సన్నివేశాల క్రమం మనంలో ఒక భావాన్ని కలుగజేశాక కథానాయకుడ్ని మనలా అలోచించేలా చేసి అతనితో మనకో లంకెని ఏర్పాటుచేస్తాడు. మనలా ఆలోచించేవాడు మనవాడే అవుతాడు కదా. ఈ క్రమంలో హీరో ఎక్కడా ప్రేక్షకుల కోసం ఈ పని చేస్తున్నట్లుండకూడదు కనుక ఇప్పుడు నాయకుడికి ఒక బలమైన ప్రేరణ కల్పించి అతన్ని సంఘటనలో ప్రవేశపెడతాడు. సంఘటనలో పాత్ర అయిన నాయకుడు ఏలా స్పందిస్తాడా అని ఇంకాస్త ఆసక్తిగా మనం ఎదురుచూస్తాం.

**Blog Archive**



**About Me**



Aaditya Chowdary Mulpuri

Those that know do,Those that understand teach.

View my complete profile

**My Blog List**

గురుకులం



అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగిరాజ పరబ్రహ్మ సమర్ధ సద్గురు శ్రీ శిరిడీ సాయినాధ మహరాజ్ కీ జై - ఓం శ్రీ సమర్ధ సద్గురు సాయినాధాయ నమః *శిరిడీ సాయి బాబా జీవితంలో ముఖ్యఘట్టాలు*: 1.మొదట 16 సంవత్సరాల బాలుడిగా ప్రకటితమైన సంవత్సరం - 1854(వేప చెట్టు - ప్రస్తు...

*2 years ago*

ప్రకృతి & సౌందర్యం



కల్లోలం... - కలలు.. నిజం కావు ఎందుకో తెలీదు.. కల మధురం, ఐనా ఆయుష్షు అల్పమే అని తెలీదు.. తెలిసీ తెలియని వాస్తవాలే కలలై...కరుగుతాయని

**భావం:** భావం అనేది జీవితంలో ప్రతి చోటా వ్యాపించి వున్న దీర్ఘకాలిక మానసిక స్థితి, ఇది కొన్ని నెలలు సంవత్సరాల తరబడి అలాగే నిలిచి వుంటుంది. మనల్ని వెంటాడుతూ వుంటుంది.

**భావోద్వేగం :** ఈ ఉద్వేగం అనేది అకస్మాత్తుగా పుట్టి అంతే హఠాత్తుగా చల్లబడుతుంది. ఇది తాత్కాలిక మానసిక స్థితి. కానీ ఎంతో ప్రభావాన్ని చూపిస్తుంది. మనలో వున్న భావాలను బట్టే భావోద్వేగాలు కలగడం జరుగుతుంది.

Ex: బాధల్లో వున్న నిరుద్యోగికి తల్లి చనిపోయింది అని తెలియడమూ, సుఖసంతోషాలతో వున్న మనిషికి ఇదే విషయం తెలియడం ఒకే విషయం అయినప్పటికీ - వారిరువురి స్పందనలో చాలా తేడా వుంటుంది. తల్లితో వున్న అనుబంధాన్ని బట్టి ప్రభావం వుంటుందని అనవచ్చేమో - అది కూడా సంఘటనల వల్ల ఏర్పడే భావమే అవుతుంది కదా.

మోటివేషన్ అనే ఈ పదం Movere అనే లాటిన్ పదం నుండి పుట్టింది. దీని అర్థం to Move - అంటే తనున్న స్థితి నుండి మరొక స్థితికి మార్పు చెందడం లేదా అభివృద్ధి చెందటం లేదా చర్య చేయడం లేదా ఇల్లు మారడం, సానుభూతి అని అర్థాలున్నాయి. ఇవన్నీ గత స్థితి నుండి మార్పుని సూచిస్తున్నాయి.

ఈ ప్రేరణలో రెండు రకాల ప్రేరణలున్నాయి అవి :

1.బాహ్య ప్రేరణ 2.అంతః ప్రేరణ వీటిల్లో మొదటిది పాత్ర శరీరం అనుకుంటే రెండవది అతని మనసు లాంటిది. కథకి రెండూ అవసరమే.

**1.బాహ్య ప్రేరణ :** ఇది కథానాయకుడి ఖచ్చితంగా సాధించి తీరవలసిన లక్ష్యాన్ని తెలియజేస్తుంది. ఈ లక్ష్యం సాధారణంగా మన చుట్టూ వున్న ప్రపంచం మనకు విసిరే సవాళ్లని(Challenge) గురించి తెలియజేస్తుంది. దీన్ని మన శక్తియుక్తులు వ్యయం చేసి ఎంతో పరిశ్రమించి సాధించాల్సి వుంటుంది.ఇది కథలో పూర్తిస్థాయి వినోదాన్ని (Entertainment అంటే హాస్యం కాదు) అందిస్తుంది. ఈ బాహ్యప్రేరణ లేని కథలు ప్రేక్షకుల సహనాన్ని పరీక్షిస్తాయి.

**2.అంతర్గత ప్రేరణ:** ఇది ప్రధాన పాత్ర బలహీనతని లేదా అతని జీవితంలో లోటుని (అసంతృప్తిని, ఆవేదనని, అశాంతిని) తెలియజేస్తుంది. ఇది లేకపోవడం వల్ల లేదా ఇది సంపూర్ణంగా అతనికి అందకపోవటం వల్ల అతని పాత్రలో వెలితిని మనం గుర్తించవచ్చు. ఐతే దీన్లో కీలకమైన విషయమేమంటే కథానాయకుడు దీన్ని తనకి తాను గుర్తించగలిగే స్థితిలో ఉండకపోవటం -ఏ మనిషి తన మానసిక సమస్యల్ని తనకి తానుగా అర్థం చేసుకునేంత పూర్ణుడు కాడు. ఎప్పుడైతే తన సమస్యని గుర్తించగలిగాడో లేదా ఆ వెలితి పూడుతుందో అతని జీవితం సంపూర్ణం అవుతుంది. ఈ సమస్యలు సాధారణంగా పాత్ర గత జీవితంలోనివే అయివుంటాయి. ఇవి సాధారణంగా పాత్రకి వుండే బంధాలు, అనుబంధాలు, బంధుత్వాలు, స్నేహం, పాత్ర అంతరంగం వంటి వాటి గురించి చర్చిస్తుంది.

Pretty Woman చిత్రంలో ఈ అంతః, బాహ్య ప్రేరణల ముగింపు ఇక్కడ చూడండి. పెళ్లిపుస్తకం సినిమాలో ఈ అంతః, బాహ్య ప్రేరణలు ఎలా మొదలయ్యాయో పై వీడియోస్ చూడండి

బాహ్య ప్రేరణ కథపై ఆసక్తి కలుగజేసి (Entertainment), పాత్ర శక్తి సామర్ధ్యాలని తెలియజేస్తే, - అంతఃప్రేరణ పాత్ర లోతుని, గాంభీర్యాన్ని, అతనిలో అనేక అంతర్గత కోణాలని తెలియజేసి ఇతివృత్తాన్ని అర్థం చేసుకునేలా చేస్తుంది (Theme). మొదటిది మనం చూస్తూ అర్థం చేసుకోడానికి ప్రయత్నించే బాహ్యప్రపంచమైతే రెండోది మనలోనే వుండి మనకి అర్థంకాని అంతర్గత ప్రపంచం.

ఈ ప్రేరణలు రెండూ విడివిడిగా కాక కథలో భాగంగా కలిసిపోయినపుడు, కథానాయకుడి జీవితంలోంచి ఇవి వచ్చినప్పుడు అది కథకుడికి కథపై వున్న సాధికారికతని తెలియజేస్తుంది. ఇటువంటి కథలు త్వరగా మన స్మృతి పథం నుంచి చెరిగిపోవు.

- మూల్పూరి ఆదిత్య చౌదరి.

(greenlong2498@gmail.com)

Posted by Aaditya Chowdary Mulpuri at 4:06 PM 

Recommend this on Google

## No comments:

## Post a Comment

Enter your comment...

Comment as: Aaditya Chowdary Mulpuri (Google) Sign out

Publish Preview Subscribe by email

## Links to this post

Create a Link

Newer Post Home Older Post

Subscribe to: Post Comments (Atom)

haram






kudali

